ఇత్యాది

కృష్ణాజిల్లా యర్నగూడెం తాలూకా గోపాలపుర నివాసుండగు

శ్రీమాన్ బృందావనం రాఘవాచార్యుల వారిచే [illegible]

రచియింపబడి

---

గోదావరిజిల్లా పోలవరం డివిజన్ కన్నాపుర నివాసులగు

మహారాజశ్రీ గెడా గెరటయ్యగారికి

అంకితముగా నీయబడినది.

---

శుభమస్తు.

# అభినవ శ్రీకృష్ణలీలలు.

—♦ విష్వక్సేన ప్రార్థన. ♦—

గీ. విష్ణు సైన్యాధిపుడవునై ♦ వెలయువాడ
సూత్రవతితోడ సయ్యాట ♦ లాడువాడ
పుణ్య జనులచే పూజలు ♦ బొందువాడ
వేత్రహస్తుడ కృపజూడు ♦ వేడ్కతోడ.

## 1. కీర్తన.

సావేరిరాగము—ఆదితాళము.

నిన్నే నమ్మితి శ్రీహరి - శ్రీ చక్రధారీ॥ నిన్నే॥
పన్నగారివాహ నీవేగతి నీ - కన్న నాకు దిక్కెవ్వరెన్న గను। సన్ను
తాంగ యాపన్నరక్ష-సుప్రసన్న వరద-నన్ను బ్రోవు శ్రీధర॥ నిన్నే॥

అంబరీష రుక్మాంగద పాలక - శంబరారి సన్నుత పదయుగళ।
కంబుకంఠ పీతాంబర వరధర-కామజనక సామజవర సన్నుత॥ నిన్నే॥
మారకోటినిభ - నీరజభవనుత - సారసాక్ష వేరుశాయకుర। మేరు
శైల సమధీర వీర - కరుణా రసార్ద్రి - గిరటయాఖ్యపాలక॥ నిన్నే
నమ్మితి శ్రీ హరీ॥

# 2. కీర్తన.

యవనకినారీ [అనే వర్ణ మట్టు.]

దేవా బ్రోవా - రావా నను గావా। భావమందున నమ్మి నేనిటు
భక్తిచే ప్రణుతింతురా॥ దేవా॥
పద్మానేత్ర - పరమా పవిత్ర। పాలకడలి శయన దుష్టుడ - బాపు
డను దరి జేర్చరా॥ దేవా॥

రామచంద్ర - రమ్యగుణ సాంద్ర । పామరుడ పాపాత్ముడను నా - దేవా॥
పాపము లెడ బాపరా॥
యిందిరేశ - యినకులాధీశ । సుందరంబగు పాదములకును - వంద దేవా॥
నం బొనరింతురా॥
శేషశయన శశిరవి నయన । భాసమాన విలాస - గెరటయ దాస
పోషణ బ్రోవుమా॥ దేవా బ్రోవా॥

## 3. కీర్తన.

కోమలాంగి తాళ కున్నదిరా [అనే వర్ణ మట్టు.]

రామ నీ నగుమోము జూపుమురా - కోమల ఘన శ్యామ॥ రామ॥
సోమశేఖరాది వినుతపదయుగ-ప్రేమజూడు కామజనక శ్రీధర॥రా॥
సుందరమగు మో - మందము జూడగ । డెందము వేడుక - నొందు

చున్నదిర । యిందు ధర సురేంద్ర వంద్య నీ పద - ద్వంద్వాములే
నమ్మి । వందాన మిడెదను॥ రామ॥

కన్న తండ్రి యీ పన్నరక్ష నీ కన్న నాకు దిక్కెవ్వ రెన్నగను ।
ఎన్ని గతుల సన్నుతింతు శ్రీ హరి । కన్నాడ నాయకు - నిన్నే నెర
నమ్మితిని॥ రామ॥

మార జనక - రిపుమారణ విగ్రహ నారదాది సుర - నతియుత
పదయుగ । నీరజాక్ష నిరటయాఖ్య పోషక - నీ నామ మేప్రొద్దు।
నింపుతో దలచెద॥ రామ నీ నగు మోము జూపుమురా॥

# 4. కీర్తన.

పరమాత్మ పరంధామ పరమేశ బ్రోవుమా [అనే వర్ణ మట్టు.]

శ్రీపతి నీవే గతి - భూపతి బ్రోవుమా । నీ ప్రాపే గోరితిని - శ్రీ
పాద వేడితిని । ఆపాద లెల్ల దీర్చి - ఆదరించుము కేశవా॥ శ్రీ॥

నారదనుత శౌరీ నమ్మితి నరహరి । కోరితి నీ కన్న - వేరెవరు
న్నారన్న । సారసాక్ష నేను జేయు - నేరములను గావుమా॥ శ్రీ॥
మందర గిరి ధర - మాధవ బ్రోవరా । బృందారకాధార - కంద
ర్ప సుందార । యిందిరా రమణ నీకు - సందేహ మేమిరా॥ శ్రీ॥
వారిగ శ్రీ గిడానంశాబ్ధి సోముడా - భాసిల్లు గిరటయాఖ్య పాలక
నిన్నే నమ్మి । ప్రార్థన జేతు-పరమ పురుష-నన్ను బ్రోవుమా॥ శ్రీ॥

# 5. కీర్తన.

రాజరాజ గజాననా [అనే వర్ణ మట్టు.]

రార లోక రక్షణా - రఘుకుల సంరక్షణా । రారా నమ్మినారా -
సకలార్తిభంజనా। రాజిల్లు మోముతో-నీజగదాధారాయిటు॥ రార॥
హరిహరి నారాయణా - ఆపదోద్ధారణా। మురహర. నా మొర విని
యిటువరములొసగుమా । వర శేషాతల్పక-సురమునిపాలక॥ రార॥

శంఖ చక్రధారణా - శత్రుజన విదారణా । సంకటములు బాపి సర
గునకృపజూడు-శంక యేలరా । పంకజలోచన-పాపవిమోచన॥రార॥
రార గెరటయాఖ్యుని - రావుశాయక బ్రోవుమీ । సురమునినుత-
కరివరదా కరుణ జూడుమా । కోరితి నీ దయ - వారిజాక్ష యిటు॥
రార లోక రక్షణా॥

## 6. కీర్తన.

యింతీ విను యీ బువ్వము [అనే వర్ణ మట్టు.]

నారాయణ నామమును - పారాయణ జేసినను। ఘోరామైన పాప
ములు - దూరామున తొలగిపోను॥ నారా॥

వాసుదేవా కృష్ణాయని - ఒక్క ఘడి నుడివినను । బాసిపోవు బ్ర
హ్మ హత్య - పాతకము లన్ని భువి॥ నారా॥

రాధా కృష్ణా మాధవని - రమ్యముతో దలచినను | మోదామున
బాయు - యమ బాధా లన్ని వేగామున॥ నారా॥

ధరణిగడ - గిరటయాఖ్యు దయతో బ్రోచు | పరమాత్ముని -
స్థిరముగను నమ్మినను | శిశు డిచ్చు సిరులెల్లను॥ నారా॥

# 7. కీర్తన.

బ్యాండు స్వరము.

నీవె దిక్కు శ్రీహరీ - నిన్నె నమ్మితి నరహరి | రావె నీదు మోము
జూప - రాక్షసాంతక నమో నమో॥ నీవె॥

పంకజాక్ష బ్రోవరా - పాపనాశనావరా | సంకటములు దీర్చరా -
సాగిలి మ్రొక్కెదరా॥ నీవె॥

వేరు శాయ బోకురా - వెంకటేశ గావరా । మూర జనక బ్రో
వరా - మదిలో నమ్మి యుంటిరా॥ నీవె॥
ధరణి గెడాయస్వాయు - డైన గెరటయూ దొరకన్। మరువకాను నిర
తమ్ముగ - మాధవ కృప జూడరా॥ నీవె॥

# 8. కీర్తన.

దేవాధిదేవా నీ సేవకుడగు నన్ను గావ రాద వేగమే [అనే వర్ణమట్టు.]

ఆపాదదీర్చర - భూపరిపాలక । శ్రీపతి నను గావరా॥ దేవా॥
ఆపా॥ పాపములను బాపి - భక్తవత్సల దేవ । శ్రీపతి కృపజూపరా॥
దేవా॥ ఆపా॥ మందర గిరి ధర మాధవ నీ పాద - ద్వంద్వాములే
నమ్మితి ॥దేవా॥ అపా॥ పామరుడను జడుడ - పాపిని మూఢుని ।
కాపాడి యెటు బ్రోతువో ॥దేవా॥ ఆపా॥ తామరసాక్ష నీ దయకు

పాత్రుడనైతి - తప్పులెన్నక బ్రోవుమా ॥దేవా॥ ఆపా॥ కన్నాపురీశ
నీ కన్న దిక్కెవ్వరు - యున్నారు యీ జగతిలో ॥దేవా॥ ఆపా॥
ధరణిని శ్రీగడా - గారటయ దొర నెపుడు । దయతోడ కాపా
డుమా ॥దేవా॥ ఆపాద దీర్చర॥

## 9. కీర్తన.

పాలకడలి శయన రార [అనే వర్ణ మట్టు.]

వేగ॥
వేగ నన్ను గాచి బ్రోవరా - శ్రీరామచంద్ర॥
నాగశయన నిన్ను యిపుడు - నమ్మి నేను బిల్వగానే । నా మొరా
లకించవేమిరా - శ్రీరామచంద్ర॥ వేగ॥
వాలి నొక్క కోలనేసి - బాలుడైన తారాసుతుని । జాలిదీర్చి
బ్రోవ లేదుగ - ఆ తారా మొరవిని॥ వేగ॥

రాతియైన అహల్య నపుడు - ప్రీతిచేత నాతిని జేసి | పాతకములు బాపి బ్రోవవా - అహల్యా జేయు| పాతకములు - బాపి బ్రోవవా | శ్రీరామచంద్ర॥ వేగ॥

అట్టి దశరథు గర్భమందు - బుట్టి రావణు తలలు గొట్టి | అట్టె విభీషనుని బ్రోవవా - ఆ లంకయు నిచ్చి | శ్రీరామచంద్ర॥. వేగ॥

తాపసాది వినుత నీదు పాపు గోరి యున్నవాడ - ఆపదాల నెల్ల దీర్చరా - ఓ పాప రహిత॥ వేగ॥

ధరణిలో శ్రీ గెరటయాఖ్యా దాసుని మొర విని వేగా = దయతో మోక్షము నిచ్చి బ్రోవరా | తామాసా రహిత॥ వేగ॥



# 1. తత్వము.

[ఫరజు—ఆదితాళము.]

మనసా నీ వెగసి పడకె - యీ మాయలోబడి చెడకె । కాయా
ము స్థిరమనకె॥ మనసా॥

పన్నుగ నీ నోట బలుకావు శ్రీహరిని - తన్ని వేతురు నిన్ను దండా
ధరుని భటులు॥ మనసా॥

యిండ్లు ధనము పశువులెల్లా కల్లలు సుమ్ము - పెళ్లాము బిడ్డాలు
భ్రాతపితృమాతలు । నీ వెళ్లాగ నిన్నంపను - ఒకరురారూర నీవెం
లనూ । నిముషముంచారురా యింటను - కళ్లుమూసి పెద్దకాష్టము
లపైబెట్టి । వెళ్లివత్తు రంత - గొల్లూన ఏడ్చుచు॥ మనసా॥

కాసులు వరహాలు కడుపెద్ద మొహిూరీలు వేసుకు మెడనిండ-వేడ్కా-
తో మురిశేవు । వేడుక యన్నాళ్లురా - యింత ఆశ నీకేలానురా ।
యమపాశములో బడకురా - కాశీ కోకలు గట్టి కాలూనిదూతలు
గట్టిగొంపోవ । నీ కాసు లేమైపోవు॥ మనసా॥

అర్థాపేక్షచేత - హరిని మరచి । కాలవ్యర్థముగ గార్ధభంబువలె
దిరుగుచు - పరమార్థ చింత మానుచు । హరి భక్తుల దూషిం
పుచు - సార్థకంబు లేని సంసారము నమ్మి । భద్రాగిరీశుని - భజన
మరచి నీవు॥ మనసా॥

వాశీగ శ్రీ గొరటయాఖ్యుని బోచేటి - వాసుదేవు నామమొక్క-
సారి మృదు । వాక్కులతో నుడువక-మాంస కండాలను బెంచుక ।
కండ్ల కావరమూ దెలియక - యెద్దులవలె తిరిగి । యెడలేని మో
హమున - ముద్దియల వలపులలో । మునిగియుంటివి నీవు॥ మనసా॥

# 2. తత్వము.

గోదావరీ తీరంబు [అనే వర్ణ మట్టు.]

బొమ్మలాట జగము - యీ బొందికి భ్రమజెందకుము । దీని నమ్మి
నకష్టమ్ము - నరకమ్ము నిజము సుమ్ము॥ బొమ్మ॥
తల్లిదండ్రి హితులు - ప్రియమైన భార్య సుతులు వల్లకాటివరకే
గాని - వచ్చేదు లేదు పైని॥ బొమ్మ॥
కూడబెట్టు భ్రమను - గొనిపోడు ధనము తుదను। విడనాడును తన
గృహము - వెళ్లిపోవును యమపురము॥ బొమ్మ॥
పంచ ప్రాణములను - బొంది బాసిపోయిన తుదను । వుంచరునిమి
షమును - వేగ గొంచు పోదురు శ్రమను॥ బొమ్మ॥
పరలోక సాధనంబు - పరమాత్ముని భజనంబు నరవరులకు సుక
రంబు - నారాయణ నామంబు॥ బొమ్మ॥

మాధవ స్మరణంబు - మడియించును పాపంబు । గొరటయు పోవుచు నమ్ము కైవల్య మిచ్చును సుమ్ము॥ బొమ్మ॥

# 3. తత్వము.

జంఝూటి—ఏక తాళము.

రాగలదు యమబాధ - ముందు రాగలదు యమబాధ । రాక ముందే హరిని - రమ్యముతో దలచండి॥ రాగ॥

అప్పలార మనకు తిప్పాలున్నవి ముందు - యిప్పుడె శ్రీ హరిని । తప్పక వేడండి॥ రాగ॥

కల్లలాడకండి - కలిమి నమ్మకండి । కళ్లు దెరచి లక్ష్మీవల్లభుని దలచండి॥ రాగ॥

దండధరుని భటులు - దయ దలచ రిక మనల। కుండాలికయనూని యండాకు జేరండి॥ రాగ॥

కాలూని దూతలు = గట్టి కొట్టాక ముందే। పాల్కడలిశయనూని భక్తితో వేడండి॥ రాగ॥
వాశిగ శ్రీ గిరటాయాఖ్యాని బోధిచే = వానూదేవు నెపుడు వదలక దలచండి॥ రాగలదు యమ బాధ॥

# 4. తత్వము.

జంఝూటి—ఏకతాళము.

క్రిందు మీాదెరుదవు జీవ = ఆ యిందిరేశుని దలచలేవ। ఎందుకు యీా శ్రమ భావ = ముందు పరమునకు జేరు త్రోవ। గనలేవ = పాపిజీవ॥ ఏర॥ క్రిందు॥
సారము లేనిది పెంట = సంసారము నమ్మకు తంట। వెళ్లిపొయ్యేనాడు దంట = వేరొక్కరు రారు నీవెంట। చూడు కంట = వట్టి శుంఠ ॥ఏర॥ క్రిందు॥

తొమ్మిది రంధ్రాల గంప = దీని నమ్మరాదుర ముంగ్లకంప | మల
మూత్రముల మురికి కొంప = భ్రమసి చెడిపోక యిది నీకు సొంప | క్రిందు॥
నీకు యింప॥ ఏర॥
దేహము స్థిరమని యనకు = దేవదేవుని విడనాడి చెడకు | చాల
ధన మున్నదని మిట్టిపడకు = నిన్ను మొట్టు యముడు తుట్టతుదకు | క్రిందు॥
గర్వపడకు = బోర్లపడకు॥ ఏర॥
గరటయాఖ్యాని ముద్దుమాట = నమ్మి గోవింద యనర నీ నోట |
పరమునకు జేరు బాట = దీని భావములో నమ్ము ఝూట | బొమ్మ క్రిందు॥
లాట॥ ఏర॥

## 5. తత్త్వము.

రక్షించవే యీశ్వరమ్మ [అనే వర్ణ మట్టు.]

కాలామంతా వ్యర్థమాయె = కమలనాభుని దలచవే | కాలా యే

ముని దూతల్ వచ్చి = కట్టి యీడ్చుక పోముందే॥ కాలా॥

నీటి బుగ్గ వంటిది కాయము = నిత్యమాని నమ్మకువే । బూటక
సంసార మిదియు బుద్ధి దెచ్చుక బ్రతుకవే॥ కాలా॥

పాపములు జేసి నరక = కూపములో బడకువే । శ్రీపతి నారాయ
ణుని = స్థిరముగను నమ్మవే॥ కాలా॥

మూడు రోజుల బ్రతుకు కింత = మురిసి చెడి తిరుగకే । మూత్ర
మలముల తిత్తి వట్టి = మురికి తోలు నమ్మకే॥ కాలా॥

వచ్చి తోలు ప్రతిమల జూచి = భ్రమసి మాయలో బడకువే ।
సచ్చిదానందుని పాద = స్మరణ నీవు మరువకే॥ కాలా॥

ధరణిలో శ్రీ గడాన్వయ = గెరటయ దొర నెప్పుడు । మరువకను
బ్రోచుచుండె = మాధవుని దలచవే॥ కాలా॥

# 6. తత్వము.

దేహము స్థిరమనకు - మనసా దేవుడు లేడనకూ । చెడకు॥ దేహ॥
మోహ సముద్రములోన మునింగియు-ముందు జరుగు యమదండన
దెలియక॥ దేహ॥ కల్లలాడబోకు - నొకరితో కయ్యమాడబోకు।
కాలయముడు నిను గట్టి యీడ్చుతరి - గోలబెట్టి నీ వేడ్తువు నిజ
ముగ॥ దేహ॥ చుట్టపక్కములను నమ్మియు మిట్టిపడకు మికను -
మొట్టి యముడు నిను గట్టుకపోవగ । చుట్ట మొకరు నీ జోలికి రా
రిక॥ దేహ॥ బిడ్డల నమ్మకు - యొకరికి చెడ్డ చేయబోకు । అడ్డ
మొకరురా రంత్యకాలమున-చెడ్డ కింకరులు చెంపలు గొట్టక॥ దేహ॥
మూఢుడ నీ కికను - ఎవుడో మూడును చావికను - ఏడుకట్ల
సవ్వారిజేసి నిను - ఏటిగట్టునకు నీడ్చుకపోదురు॥ దేహ॥ ఆశచేత

చెడకు - యమపాశములోఁబడకు। వాసిగ గెరటయు దాసవరదుఁడా-
కేశవు భజనలు జేసుకొనుము యిక॥ దేవా॥

# 1. కృష్ణలీల.

కాంభోజి—అటతాళము.

నందతనయ నీకు - యెందుకీ తొందర । మందలో నుండి నా
మగడు వచ్చెడి వేళ॥ నంద॥ కందర్పజనక నా నిందపాల్సేయకు -
వందన మిడెద నీ సుందార పదములకు । కుందరదనా లరుగో చూ
డార - మనవంక తిరిగి మందహాసము చేయుచుండెనురా । మన
కిద్దరికి - పొందు జరుగుట దుస్తరంబురా । అల్లదిగో వినుము -
ముందరింటిలో సందడాయెనురా । ఎందు కిక యారళ్లు - మూరా
ముళ్లురా । నీ విందు రాకిక ఏ వెనుక చూడ దత్త। మూల

గదిలో యున్న దదిగో॥ నంద॥ కురులు నున్నగ దువ్వి కొప్పు బెట్టితి
సామి । కొప్పు చెదరితె - అత్త కోపగించు నేమొ। విరులు కొప్పు
లోన ముడువకురా - విభు డింద్రజిత్తు । త్వరలో వాసన పసియు
గట్టునురా - బల్ పచ్చి తురక నరుకులాటంకేను వెరువదురా ।
పరసతుల పొందు - ప్రాణహాని। ఏమి హోయీర - మురహరా నా
మాటలను నొక మూల దోసియు । చెరగు విడువక ।, పరిపరి విధ
ములను చెయ్యిబట్టి బ్రతిమాలెద విదేమి॥ నంద॥ ధరణిలో శ్రీ
గడా గిరటాయాఖ్యుని బోచి - దొరవని చూడడు । మరదికోప
దారి మామ జూచిన మచ్చమావునురా - కోపము బడకు । మాప
టికి నే నొక మాయ వేషము బన్నిదానురా - కారణము లేకుండ
గను నే కడకు బోతిని । యనుచు బొంకియు వేరుగా పవళింతు
పెరటిలో - వేడ్కతో నీ వటకు రమ్ము॥ నంద॥

# 2. కృష్ణలీల.

శుద్ధసావేరి—అటతాళము.

విన్నావటమ్మా యశోద - నీ చిన్ని తనయుని పరియాద । నిన్న
రాత్తిరి విభుని కన్నామిదుచుండగ చిన్ని కృష్ణుడు నన్ను కన్ను గీటు
చువచ్చి - సన్నుతాంగిరా వినుము । నీ సఖుడున్న భయమేమున్న
దని నా - కన్నుదోయిని మూసి చట్టిలో వెన్న నెత్తుకు నెల్లినాడే॥
విన్నా॥ ఎట్లు జేతుము యీ కాపురము - యీ పాట్లు ఏమని
జెప్పుదుము । మల్లగంగి నిన్న పట్టుపగలు - పూలపట్టు । పాన్పున
బున్నకొట్టి నిదురించగ - వుట్టిపై నున్నట్టి పెద్ద చట్టిలోని పాలన్ని
దాగియు । అట్టె దాన్మెడ పూలదండలు గట్టి యల్లరిబెట్టివచ్చెనె॥
విన్నా॥ చందానగంధిరో వినవే - నాకు చెప్ప శిగ్గయ్యెను గదవే ।
సుందరాంగిరో నీదు - సుతుడెంతో పలుగాకె । సందచీకటి పెరటి

సందు - దారిని వచ్చి | అందముగ నొక తేలు పిల్లను - యిందవే
యని జడను గట్టియు | యిందువదనరో గొరటయా దొరనేలు కృ
ష్ణుం డెందుబో యెనో॥ విన్నావటమ్మా యశోద॥

## కృష్ణలీల.

### కాంభోజి—అటతాళము.

వద్దురా యీ పని - రద్దికి మూలమా | గద్దరి తనమేలరా - హ
ద్దుమీరి తో వళద్దాము రాకుర | బుద్ధి చెప్పించెద పుండరీకనేత్ర -
వద్దుర నామేన గంధము రుద్దెద వేమిర నీకు| ముద్దుగాదిక లేచిపోర-
మద్దుల బడగూల్చిన హరి॥ వద్దు॥ పరమ పురుష కొంగుబట్ట నచ్చె
దవేమి - పాపము గోపాలక | పంచశర జనక నా పదము వెంట
రాకు - పదరా మునసబు కడకు | పరువు దీయించెద - దురుసు
తనమిక వలదురా | మురహరుడవై నను జడియడిక నా - వ

జూచిన । నురుమురా = నీ పరువు దక్కదు పార్థసారథి॥ వద్దుర॥ మారజనక వినుము = మందలో నుండి నా । మగడు వచ్చెడి వేళ రా = దూరమారసి చూడు। దుడుకు తనమును వీడు – దూరముగ నునిల్వు । దూర్వాసనతచరణ = మురహరా నా వద్దనుండకు। మో సమా నిక నీదు పొందున = సరగునను నీదారి జనుమిా = సారసా యతలోచనా హరి॥ వద్దు॥ కళ్లబడిన తప్పు కాయడు నా మామ- కై జారుదీసునురా । కుళ్లబొడుచును = అత్తకుసుమాస్త్రజనకనా । గూడ సమయముగాదు = కుంతి మాధవ దేవ వెళ్లరా । నా కెందు కీ యారళ్లు = మారాముళ్లు యిక మా యిళ్లకును రాబోకుర। నీ కాళ్లకును మొక్కెదను సామి॥ వద్దు॥ సారసాక్షు కృష్ణ సార్వభౌముడ నీకు = సాటి ఎవ్వరీ జగతిలో। వేరుకాయబోకు ధర గాడగారటయా దొర నేలినావని = సారసాక్షు వింటిరా। నీ సంనిధి జేర్చుము సామి॥ వద్దూర యీా పని॥

# 4. కృష్ణలీల.

శ్రీరాగము—అటతాళము.

వీలుగాదు సామీ = నలుగురిలో నన్నల్లరి జేయకుమి । వీలుగాదని వేయి విధముల = వేడినను నన్నేల విడువవు। మేల యిది మగనాల నను - రవ్వేల జేసేవు రాకు పైబడ॥ వీలు॥ మాట దక్కదోయి = నలుగురిలో నగుబాటుకాయకోయి । పూవులు కొప్పులోన ముడువకోయి - వద్దనగా నామేను ముట్టకోయి । మాటిమాటికి రాకు నా సరిజోటు లెరిగిన = నలుగురిలో నగుబాటు పేళనచేతురిక । కనుగీటు లింక చాలించు మిక్కడ॥ వీలు॥ అంటరాకుపోరా। చందనము నావంటికి బూయకురా = నా మగడు విన్న తంట దెచ్చునుగదరా। చాల్ చాలు యిక మా యింటికి రాకూర = వంటరిగ [illegible]

నికి । వెంట దర ఘుకు వచ్చెదవు నీ = కొంటె నడతలు గెరటయా
దొరవింటే పరువుకు భంగ మొదవును॥ వీలు॥

# 5. కృష్ణలీల.

కాంభోజ—ఆదితాళము.

పోర యింతట చాలు నాసామి = పోరాటమేలర॥ పోర॥ మారజనక
నాదు బావ క్రూరుడు బహు దుండగీడు । దూరమాలోచించబోడు
ధూర్తువాడురా = మీరిమీరిజూచు ఏమి నేరనట్టియుండు మరది ।
యూరికె యనుమానపడును – నీరజాక్ష నిచట నిలువక॥ పోర॥
కంట బడిన నాదు తప్పు కాయడు నా మామ కాలకంఠుడు బల్
మోటుబంటు తంట దెచ్చురా = మంటలమారి మేనత్త మహిలో
లేని యాడది బల్ తంటకోరు యాడబిడ్డ । వింటే గెంటు యింట
నుండి॥ పోర॥ కందర్పజనక నా యత్త కందిరీగవంటిది = పూరంద

బాన్పు జేరి బలవించుచున్నదిరా । కోమలాంగి తాళదింక నిమిసము-
కోరిక దీర్చర గోపాల యీవేళ॥ సార॥ రమ్మిక శ్రీ గడగరటయా
ఖ్యనుత - రమణి నీకు దగియున్నదిరా । కొమ్మ నిన్నె నమ్మి యున్న
దింకను - సమ్మతితో నాచాన బోంచి వారి॥ సారసాక్షి॥

౮. కృష్ణలీల-రక్షించవే ఈశ్వరమ్మ [అనే వర్ణ మట్టు.]

అమ్మ వినవే యశోదమ్మ - అల్లరి యీ దుడుకులు । యిమ్మహిలో
నీదు సుతుడు - మమ్మ నిలువనివ్వడే॥ అమ్మ॥ పట్టపగలు మొన్న
నాయిలు గుట్టుగాను జొచ్చెనే - వుట్టిమీద వెన్నకుండ వట్టిది జేసి
వచ్చెనే॥ అమ్మ॥ రాత్రిరి నే నింటిలోను ప్రీతితో బవళించగ-పాత
తల్పులూడదన్ని - కోతిని పై వేశనే॥ అమ్మ॥ ధరణి శ్రీ గడాన్వ
యు గౌరటయా దొర నేలిన-మురహరుడాని జడియమికను ముదితరో
మర్దింతుమ అమ్మ।

# మంగళహారతి.

తీరైన పదినెలకు [అనే వర్ణ మెట్టు.]

1. హారతివ్వారె మన శ్రీరామచంద్రులకు - సారసాక్షులు పరమాత్మునకు - జయజయ॥ హా॥
2. శ్రీరామచంద్రులకు - సీతాసమేతులకు - వీరరాఘవులకు వెలదులందరు - జయజయ॥
3. దశరథ రాములకు - దశావతారునకు - దానవాంతకునకు - తరుణు లందరు వేగ॥ హా॥
4. భాసురముగ గిరటయాఖ్య - భక్తదాసపోషునకు - భాసమానహాస - చిద్విలాసునకు - జయజయ॥ హా॥
5. కన్నాపురీశునకు - కరుణాంతరంగునకు - కాంచనాంబరునాకు - లక్ష్మీకాంతునకు - జయజయ॥ హా॥

• సంపూర్ణము. •

# శ్రీవైష్ణవపత్రిక.

శ్రీవైష్ణవ మతమునం దభిమానము కలవారును, ఆ మత సిద్ధాంత రహస్యములను తెలియ గోరువారును, ముఖ్యముగా నీపత్రికకు చందాదారులగుటమంచిది. శ్రీవైష్ణవ ధర్మములును, పూర్వాచార్యుల దివ్యచరిత్రములు, మొదలగు ననేకోపయుక్త విషయములు ముద్రింపబడును. దీనియందు దివ్యదేశముల యందలి దేవాలయాదులయొక్కయు, భగవద్విగ్రహముల యొక్కయు ఫోటోలు ప్రతి నెలకును చేర్చబడును. కావున త్వరపడి దీనికి చందాదారులగుడు.

చందా సం॥ కు 1—8—0 లు. మాత్రమే.

వి. పీ. ఖర్చులు వేరు.

మేనేజరు:—శ్రీవైష్ణవ పత్రికాకార్యాలయము,

పెంటపాడు, కృష్ణాజిల్లా.